# ఆర్యా

## (నీతిద్విషష్టిక)

ఆదికర్త

## సుందరపాండ్యుడు



అనువాదకర్త

## డాక్టర్ పి. నాగమల్లీశ్వరరావు

## 'ఆర్య' వాక్యాల ముఖ్యాల నాహారింతు

- సభను పరపరివాదము సరవి గాదు
- ఎదిరి నెదిరించి వదరుట వదల వలయు
- మంచి మాటల నెదిరిని మించ రాదె
- క్షాంతి మంత్రంబె మందుగ శాంతి నిచ్చు
- చల్లదన మిచ్చుగాదె సజ్జనుల వాక్కు
- సత్య సంపన్నుడై యుండు సజ్జనుండు
- స్వజన మను నట్లు వర్తించు కుజను డెపుడు
- స్నేహశీలు డొక్కడె చాలు చెలిమి చేయ
- ఋషికి తుల్యుడౌ మరి క్షమియించువాడు
- కోప మున్న దేమాత్రము కూడ దెపుడు
- చల్లదనమును వీడునె? చంద్రు డెపుడు
- విద్య ధన మౌను! విత్తము విద్య యౌనె?
- వెలను కట్టగ లేనిది చెలిమి యొకటె
- కావలయు లౌకికజ్ఞాన కౌశలంబు!
- పలుకుబడిని బడయకున్న ప్రాకృతుండె
- తీపికాయల నిచ్చునె? వేపచెట్టు
- వంకరను వీడునే నెలవంక యెపుడు
- కన్ను తనలోని మచ్చను కాంచలేదు
- పరుల లోపాలె చూపును పాపి ఎపుడు
- దక్షు డొందును శ్రేయమ్ము దాత యశము

---


*Dr. P. Nagamalleswara Rao* Ph.D.,

Lecturer in Telugu,

A.B.M. Junior College, ONGOLE - 523 001,

Prakasam District, A.P.

**Phone: 08592 - 38040 (R)**

# ఆర్యా

## (నీతిద్విషష్టిక)

ఆదికర్త

## సుందరపాండ్యుడు

అనువాదకర్త

## డాక్టర్ పి. నాగమల్లీశ్వరరావు

CITATION ఉదాహారవము

Dr.P. Nagamalleswara Rao డాక్టర్ పి.నాగమల్లీశ్వరరావు
"AARYA" "ఆర్య"
(Translated from Sanskrit) (సంస్కృతము నుండి అనూదితము)

August, 2002 2002, ఆగస్టు
Chitrabhanu sravanam శ్రీ చిత్రభాను శ్రావణము
1924(Saka) (శక) ౧౯౨౪


Price:Rs.35/- మూల్యము:రూ.౩౫

Computer type setting అక్షరన్యాసము
R.V.N.V. Prasad ఆర్వీయన్వీప్రసాదు
printing ముద్రణము
Vijaya Krishnan,Ongole విజయకృష్ణ, ఒంగోలు

Copies can be had from: ప్రతులు వలయు వారు లిటకు వ్రాయవచ్చు
Mrs. P. Padmavathi శ్రీమతి పి. పద్మావతి
Dharavari thota ధారావారి తోట
Ongole1 ఒంగోలు. 1

శ్రీమత్తిరుమల తిరుపతి
స్వామిస్థానమ్ము ద్రవ్య సాహాయ్యముతో
ఈ మాదిరి రూపొందెను
స్వామీ పాదముల జేరె సప్తగిరీశా!

## 'ఆర్య' ముందుగ వందన మందుకొనుడు

స్వామికి, తిరుమల తిరుపతి
స్వామికి, సతతము బుధజన సంరక్షకు డౌ
స్వామికి, మామకకృతి నిడి
స్వామికి మ్రొక్కెద మము దయ సాకగ నెపుడున్

తాతగారిని ముందుగ తలచి, పిదప
తల్లిదండ్రుల ఆశీస్సు లెల్ల కలుగ
భక్తి భావమ్ము మదిలోన పాదుకొల్పి
ఐదు పది చేసి మ్రొక్కెద పాదములకు

ఓనమాల నాటి ఓంకార మాదిగ
నేటి దనుక చదువు నేర్పినట్టి
మాన్యులైన గురుల మహితపాదములకు
చేతు లద్ది జోత చేయువాడ

## ‘ ఆర్య ’ పరిచయమవచనమ్ము లరయు వినతి

‘ఆర్య’ ! సుందర పాండ్యు డీ ‘ఆర్య’కర్త
ఆరవ శతాబ్దికే పూర్వు డాత డండ్రు
‘ఆర్య’ యను ఛందమున నిది ‘ఆర్య’ యయ్యె
శిష్ట వాక్యాల ‘నీతిద్విషష్టి’[1] యయ్యె

అట్టి ఛందము చందము బట్టి చూడ
తేటగీతి యాట వలన ‘ తేట గీతి’
యనియొ ‘నీతిగీతి’ యనియొ అనుట తగును
కాని, ‘ఆర్య’ లోని సొగసు కానరాదు

ఆర్యలోకాన నియ్యది ‘ఆర్య’ యనుచు
పేరు ప్రఖ్యాతు లందిన తీరు చూచి
‘ఆర్య’ లోని అర్థస్ఫూర్తి నాదరించి
పేరు మార్చుట తగ దని ఊరకొంటి

‘ఆర్య’ ఛందము కందము నట్లు మార్చి
వాడుకొను టన్న డుమువులు వరుస చేర్చి
పేర్చి నట్లుండు నని యెంచి మార్చి, దాని
‘తేటగీతి’ గ కూర్చితి తేటపడగ

---

1. 'ఆర్య' నామాంతరము 'నీతిద్విషష్టిక'

'ఆర్య ' లన 'తేటగీతులు ' నైన నొకటె
జాతిపద్యాలె రెండను నీతితోడ
ఇటుల ఈ జాతి పద్యాల నింపుమీర
వ్రాయు బూని తి మన్నన సేయుదగును

పంచతంత్రము వ్రాసిన పండితుండు[2]
మంచన[3] యనగ బరగిన మించు కవియు
భీమఖండంపు ' కవి సార్వభౌమ ' కవియు[4]
సుమతి శతకంపు కర్తయు[5] విమల మతులు
ఆర్య పద్యాల గైకొని ఖ్యాతు లైరి

ఆర్య లోకాన నీరీతి ఖ్యాతి గన్న
శ్లోక రత్నాల నెల్లను సేకరించి
మూల భావాల నన్నిటి పొందుపరచి
దీని ననువాద మొనరింతు తెనుగుబాస

సౌమ్య మూర్తియౌ శ్రీరామచంద్రబుధుడు[6]
వారి సంపాదకత్వాన వచ్చినట్టి
ప్రథిత 'సురభారతి సమితి ' ప్రతియె నాకు
మూల మయ్యె నయ్య! నెనరు! మోద మలర

---

2. విష్ణుశర్మ
3. కేయూరబాహుచరిత్ర
4. శ్రీనాథుడు
5. బద్దె భూపాలుడని ప్రతీతి
6. డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడు, కార్యదర్శి, సురభారతి సమితి, హైదరాబాదు.

శ్రీమాన్ సున్దరపాణ్ద్యః
శ్రుతిస్మృతిప్రసృతసత్పదార్థజ్ఞః
కృతవానార్యాం సమ్యక్
శ్రోతౄణాం బుద్ధివృద్ధికరీమ్ ౧

శ్రీయుతుడును శ్రుతి స్మృతిశ్రీయుతుండు
ఖ్యాతసుందరపాండ్యనామాంకితుండు
బుద్ధివృద్ధికరంబుగ బోధ సేయ
'ఆర్య' రచియించె మెచ్చగ నార్యులెల్ల 1

శృణుత శ్రుతిజలధౌతైః
కర్ణైః సుశ్లిష్టసన్ధిసమ్బన్ధామ్
శ్రుత్వావధారయధ్వం
దోషాన్సన్తో నుదన్త్వత్ర ౨

శిష్టసంధిబంధమ్ముల శ్లిష్ట మనగ
వేదజలధౌతకర్ణాల వినుడి 'ఆర్య'
దోషలేశము లున్నను తొలగ ద్రోచి
'ఆర్య' అను 'వాదము'ను జూడు డార్యులార! 2

సద్భాషితరత్నానాం
రత్నానామివ సుదేశజాతానామ్
హృది నిచయః కర్తవ్యః
సజ్జనసంమానకామేన 3

ఇలను విలువైన రతనాల నెదను దాల్చి
మాననీయుడై మనుజుడు మసలు రీతి
సౌమ్యవచనాల రతనాల సరము దాల్చి
వరలవలయు సమ్మానము వలచు వాడు 3

పరపరివాదః పరిషది
న కథం చ న పణ్డితేన వక్తవ్యః
సత్యమపి తన్నవాచ్యం
యదుక్తమసుఖావహం భవతి 4

సభను పరపరివాదము సరవి గాదు
పరగ సత్యమే యైనను పండితునకు
సూనృతము లైన వాక్కులె కాని నుడువ
జనదు, పరులకు దుఃఖభాజనము లౌట 4

భూమిపతావర్థపతౌ
విద్యావృద్ధే తపోధికే బహుషు
మూర్ఖేష్వరిషు చ గురుషు
విదుషానైవోత్తరం వాచ్యమ్ ౫

**ధరణిపతితోడ, నిరవధిధనికుతోడ**
**మునుల తోడను, మూర్ఖులౌ జనులతోడ,**
**విద్యవలన వినయమున వృద్ధులైన**
**గురుల తోడను, శాతవకులముతోడ,**
**పండితుండైన వాడెప్డు మండి పడుచు**
**ఎదిరి నెదిరించి వదరుట వదల వలయు 5**

స్వాధీనే మాధుర్యే
మధురాక్షరసంహితేషు వాక్యేషు
కిం నామ సత్త్వవన్తః
పురుషాః పరుషాణి భాషన్తే ౬

**మధురభావజాలంబులు మదిని గలుగ**
**సరసమధురాక్షరంబులు సరసనుండ**
**శిష్టవాక్యజాలమ్ములు చెంతనుండ**
**పరగి పురుషులు పరుషముల్ పలుక నేల? 6**

అప్రియముక్తాః పురుషాః
ప్రయతన్తే ద్విగుణమప్రియం వక్తుమ్
తస్మాదవాచ్యమప్రియ
మన్యప్రియవాక్యకామేన ౭

**అప్రియంబులు పలుకంగ నప్రియములె**
**వచ్చు నంతకు మించగ బదులు పల్కు**
**లది ఎరింగియు పలుకంగ నగునె వాని**
**మంచి మాటల నెదిరిని మించరాదె? 7.**

అల్పాక్షరరమణీయం
యః కథయతి నిశ్చితం స వై వాగ్మీ
బహువచనమల్పసారం
యః కథయతి విప్రలాపీ సః ౮

**అల్పవచనమ్ము లందున అధికమైన**
**భావజాలమ్ము గూర్చిన వాగ్మి యౌను**
**వచనబాహుళ్య ముండియు భావ పటిమ**
**చూప కున్న నతడు విప్రలాపి యౌను 8.**

శబ్దార్థసూక్ష్మవసనా
సత్యాభరణా విచిత్రహేత్వఙ్గీ
విద్వన్ముఖనిష్క్రాన్తా
సుస్త్రీవ విరాజతే వాణీ ౯

పదము నర్థమ్ము పొలుపుగ పడుగు పేక
రీతి విలు వైన వలువ యై ప్రీతి గూర్ప
సత్యవాక్కులె భూషణసమితి గాగ
సతము విద్వాంసుముఖవినిర్గతము నొంది
వాణి రాణిల్లు సన్నుతవనిత వోలె 9

దుర్జనవదనవినిర్గత
వచనభుజఙ్గేన సజ్జనో దష్టః
ఔషధశతైరసాధ్య
శ్చికిత్స్యతే క్షాన్తిమన్త్రేణ ౧౦

దుష్టవదనవినిర్గతదూష్యవాక్కు
సర్పసదృశమై బాధించు సజ్జనులను
వచనసర్పదష్టుం డైన వాని కెపుడు
క్షాంతి మంత్రంబె మందుగ శాంతి నిచ్చు 10.



అవమానారణిమధితం
దుర్వాగిన్ధనవివర్ధితజ్వాలమ్
సత్పురుషాః కోపాగ్నిం
జ్ఞానామ్బుఘటైః ప్రశమయన్తి ౧౧

**అరయ నవమాన మరణిగ నగ్ని గల్గ**
**దుర్వచన మింధనమ్ముగ తోడు కాగ,**
**సతము కోపాగ్ని విజ్ఞానజలమువలన**
**శాంతి నొందింప దలతురు సత్పురుషులు** 11.

న తథా శశీ న సలిలం
న చన్దనరసో న శీతలచ్ఛాయా
ప్రహ్లాదయతి హి పురుషం
యథా మధురభాషిణీ వాణీ ౧౨

**కాదు చంద్రుడు, సలిలము కాదు, కాదు**
**గాక చందనరసమ్ము, కాదు సుమ్ము**
**మందశీతలచ్ఛాయ, ఆనంద మిచ్చు**
**మధుర భాషణ మొక్కటే మానవునకు** 12.

న తథా రిపుర్న శస్త్రం
నాగ్నిర్న విషం న దారుణో వ్యాధిః
పరితాపయతి చ పురుషం
యథా కటుకభాషిణీ వాణీ ౧౩

కాదు శతృవు, శస్త్రము కాదు, మరియు
అగ్ని విషమును వ్యాధియు నట్లు కాదు
ఒక్క పరుషమౌ భాషణ మొకటె మాన
వులను బాధించు మనసుల కలచి వైచి 13.

రజనికరః ఖలు శీతో
రజనికరాచ్చన్దనో మహాశీతః
రజనికరచన్దనాభ్యాం
సజ్జనవచనాని శీతాని ౧౪

చల్లదనమును సమకూర్చు చందమామ,
అంతకంటెను చందన మందజేయు,
చందనముకంటె ఇంకను చంద్రుకంటె
చల్లదన మిచ్చు గాదె సజ్జనుల వాక్కు 14.

దివసకరః కిల తీక్ష్ణో
దివసకరాత్పావకో మహాతీక్ష్ణః
దివసకరపావకాభ్యాం
దుర్జనవచనాని తీక్ష్ణాని ౧౫

**దినకరు డెపుడు నరులకు తీక్ష్ణ మిచ్చు**
**అంతకంటెను తీక్ష్ణమౌ అగ్ని, కాని**
**అర్కుకంటెను ఇంకను అగ్నికంటె**
**అధికతీక్ష్ణమై యుండునే! అధము వాక్కు** 1!

ఇక్షోరగ్రాత్ క్రమశః
పర్వణి పర్వణి యథా రసవిశేషః
తద్వత్సజ్జనమైత్రీ
విపరీతానాం తు విపరీతా ౧౬

**చెరకు కొననుండి తినుచుండ పెరుగు తీపి**
**చెరకు మొదలంటి తినుచుండ తరుగు తీపి**
**సుజనదుర్జనస్నేహముల్ చూడ నీ క్ర**
**మంబె అవరోహణారోహణంబు లగును** 1

పరుషానలప్రగల్భా
దుర్జనవదనాత్ప్రవృద్ధవాగుల్కా
కుగృహాదివ దుష్టస్త్రీ
త్వరితగతిర్నిస్సరతి వాణీ ౧౭

పరుషమనలప్రగల్భమై పరగునట్టి
విధమున ప్రవృద్ధవాగుల్కవిరసభాష
దుర్జనవదనమ్ము వెడలు దుడుకు తోడ
పాపసదనంబు వెడలెడు వనిత రీతి 17.

మూర్ఖేషు కుశలమానిషు
విజానతాప్యకులేన భవితవ్యమ్
విపులమపి కథితమర్థం
మూర్ఖా మోహాదపహసన్తి ౧౮

పండితమ్మన్యులైనట్టి వారి మధ్య
పండితుండైన మౌనమె మండనంబు
మాటలెంతగ పరులకు మంచివైన
పరిహసించుట నైజము వారి కెపుడు 18.

మూర్ఖా న ద్రష్టవ్యా
ద్రష్టవ్యాశ్చేన్న తైస్తు సహతిష్ఠేత్
యది తిష్ఠేన్న తు కథయే
ద్యది కథయేన్మూర్ఖవత్కథయేత్ ౧౯

**మూర్ఖజనుని చూడగరాదు ముఖము నైన,**
**చూచినను వారితోడ కూర్చొనగ రాదు,**
**కూర్చొన దలప, మాటాడ కూడ దెపుడు,**
**తప్ప దన్న మూర్ఖులె కాక తప్ప దకట! 19.**

న తథా భవతి భయం మే
వ్యాఘ్రం దృష్ట్వా వనే పిశాచం వా
మూర్ఖం దృష్ట్వాభిముఖం
యథా భయం మాం సమావిశతి ౨౦

**వ్యాఘ్రదర్శన మైనను భయము లేదు**
**భూతదర్శన మైనను భీతి లేదు**
**కాని మూర్ఖుని దర్శన మైన చాలు**
**భయము నిజముగ, నిజముగ భయము భయము 20.**

కాన్తారపాదపానాం
యథా ఫలం మానుషైరననుభోగ్యమ్
ఏవమనార్యేష్వర్థాః
మనసాప్యార్యైరననుభోగ్యాః ౨౧

**కుమతు లైనట్టి పురుషులు కూడ బెట్టు**
**ధనము కొరగాదు సుమతుల పనుల కెపుడు**
**అడవి గాచిన ఫలములు నడవి పాలె**
**కాక, జనముల కుపయోగకరము లౌనె? 21.**

ఉపభోగకాతరాణాం
పురుషాణామర్థసఞ్చయపరాణామ్
కన్యారత్నమివ గృహే
తిష్ఠన్త్యర్థాః పరస్యార్థే ౨౨

**అర్థసంచయమ్మునె పరమార్థ మనుచు**
**అనుభవింపగ భయపడు ధనికు డెపుడు**
**కన్యరత్నము రీతిని కాసుకూడ**
**పరులకొరకె పనికివచ్చు, తిరుగు లేదు. 22.**

కస్తస్య జీవితార్థః
సతి విభవే కశ్చ తస్య పురుషార్థః
యోర్థినమభిముఖమాగత
మనభిముఖస్సన్ విసర్జయతి. ౨౩

రూక గలిగియు నేమియు నీక యున్న
యాచకుని జూచి మొగమును దాచుకొన్న
ధనము గలిగి యున్నను ప్రయోజనము సున్న
ఇంక పురుషార్థ మేమి సాధించినట్లు? 23

చారిత్రనిర్మలజలః
సత్పురుషనదోఽక్షయో భవతు నిత్యమ్
యస్య విభవారవిన్దే
విద్వద్భ్రమరాః కృతవినోదాః ౨౪

ఎవని చరిత విమలజల మెవని జూడ
సత్పురుషనద మని జనుల్ సన్నుతింతు
రతని విభవార విందము నందె తిరుగు
సుకవిసారంగరాజముల్ శోభతోడ
అక్షయం బగు గావుత! అతని యశము! 24.

జీవతి స జీవలోకే
సుజీవితో నష్టయన్త్రణైః ప్రణయాత్
యస్యోద్యానతరోరివ
సుహృద్భిరుపభుజ్యతే లక్ష్మీః ౨౫

ఎవని సంపద నిక్కముపవనతరువు
లీల నెట్టి యాటంకంబు లేక యున్న
పగిది మిత్రుల కుపయోగపడునో వాడె
ధరణి జీవితు డన దగు తథ్యముగను 25.

యస్మిన్ జీవతి జీవతి
మహాజనస్తస్య జీవితం నామ
జీవన్న పి న స జీవతి
న జీవతి యమాశ్రితః పురుషః ౨౬

ఎవని హితము గోరువారెవరు గలరో
ఎవని బ్రతుకు నాశింతురో ఎల్లవారు
వారె జీవితవంతులు వసుధ మీద
అటుల కాకున్న జీవితు లనుట కల్ల 26

జ్ఞానవతామతిథీనాం
లోకజ్ఞానాం ప్రకాశవంశానామ్
ప్రణయాద్గృహే నివసతాం
శేషభుజః సన్తు నః సుహృదః ౨౭

జ్ఞానవంతుల నతిథుల మాననీయ
వంశజుల నాదరించుచు వార లెల్ల
తినిన తదుపరి ఎవ్వరు తినెడి వారొ
అట్టి వారె మా మిత్రులై యలరు గాక! 27

సత్కారపూర్వమార్యః
ప్రయచ్ఛతిచ్ఛన్నమర్థమర్థిభ్యః
యద్యపి నీచో యచ్ఛతి
తత్కారణవచ్చ జనవచ్చ ౨౮

సజ్జనుం డిచ్చు యాచకసమితి కెపుడు
గొప్పగా గౌరవించుచు గుప్తముగను
దుర్జనుం డైన వాని కీ దోచెనేని
ఇచ్చు, హెచ్చుగ జను లెల్ల మెచ్చునట్లు 28.

శీలం శౌచం శాన్తి
ర్దాక్షిణ్యం మధురతా కులే జన్మ
న విరాజన్తే సర్వా
ణ్యర్థవిహీనస్య పురుషస్య ౨౯

**సతము శీలమ్ము, శౌచమ్ము శాంతి కలిగి**
**కులము దాక్షిణ్యమాధుర్య గుణము లెన్ని**
**కలిగి యుండియు, కలిమియ కలుగ కున్న,**
**ఎన్ని యున్నను మిన్నగ నేమి ఫలము? 29.**

మానో వా దర్పో వా
విజ్ఞానం విక్రమః సుబుద్ధిర్వా
సర్వం ప్రణశ్యతి సమం
విభవవిహీనస్య పురుషస్య ౩౦

**జ్ఞాన మున్నను, మహితమౌ మానమున్న,**
**విక్రమంబున్న, ఉన్నను విమలబుద్ధి,**
**ఎన్ని యున్నను అన్నియు సున్న, కలిమి**
**కలుగకున్న నిం కేమియు కలుగ నట్లె 30.**

హేతుప్రమాణయుక్తం
వాక్యం న శ్రూయతే దరిద్రస్య
అప్యస్పష్టం వాక్య
మనర్థం పూజ్యం సమృద్ధస్య ౩౧

**హీనవాక్యమ్ము కాకున్న హేతువంత**
**మైన గాని సాగునె ధనహీను వాక్కు?**
**స్పష్టవాక్యమ్ము కాకున్న దుష్టమైన**
**గాని, సాగును ధనికు డౌ వాని వాక్కు 31.**

ఖ్యాతేఽపి కులే జాతః
ప్రగీ్వ వాగ్మీ సుదర్శనీయశ్చ
ఆర్యైర్గుణైర్వియుక్తః
పలాశ ఇవ పుష్పితో భవతి ౩౨

**పూజ్యవంశంబు నందున పుట్టి యున్న**
**చతురమతి యైన సౌందర్యసహితు డైన**
**గుణవిహీను డై యున్న, ఆ కుమతి జూడ**
**పూలు పూచిన మోదుగు వోలె నుండు 32**

విద్యా శ్రుతం తపో వా
హ్యైశ్వర్యం వా యశః ప్రకాశో వా
శీలరహితస్య పుంసో
ద్విరదస్నానోపమం భవతి 33

**విద్యయును సుప్రకాశంబు సద్యశంబు**
**లున్న, తప మున్న, ఐశ్వర్య మున్నగాని,**
**శీల మన్నది లేకున్న చాలు.చాలు**
**గజము స్నానము చేసిన కరణి నుండు. 33.**

తీరాభిషేకగమనై
ర్నిదాఘసూర్యానువర్తనస్నా(స్థా)నైః
శిశిరేష్వ (ప్సునివాసై) సుప్తవాసై
ర్నా శీలః స్వర్గమాప్నోతి 34

**శీలహీనత తోడుత చిత్త మున్న**
**అర్థి తప మాచరింప నిరర్థకంబె!**
**తీర్థయాత్రలు చేసిన సార్థకంబె?**
**స్వర్గ సుఖమును పొందుట సత్య మగునె? 34.**

గన్ధైర్వా మాల్యైర్వా
కిం శీలవతో మహార్హరమణీయైః
దిశి దిశి యస్య ప్రసృతో
గుణాధివాసో యశోగర్భః          ౩౫

**శీల మనెడి సుగంధము చాల యున్న**
**యశము వశ మౌను, మరి దశదిశలప్రాకు**
**మాసి పోవును మాలలు వాసనలును**
**అట్టి వానిని గోరిన ఎట్టి ఫలము?          35.**

భవతు చ న భవతు (విత్తం)
కులీనతా దుర్లభా మనుష్యస్య
ప్రాప్య చ కులపుత్రత్వం
చారిత్రాఢ్యేన భవితవ్యమ్          ౩౬

**కలిమి కలుగంగ వచ్చునో? కలుగ రాదో?**
**కులము మంచిది కలుగుట కలిమి కాదె!**
**అట్టి వంశమ్ము నందున పుట్టి నేని**
**వాడు సచ్చరితుండు కావలదె పూని.          36**

శీలమపి రక్షమణాః
శ్రుతవన్తః శౌర్యధైర్యసంపన్నాః
నీచైస్తథా మిలన్తే
యధా (కిల న) విక్రియాం యాన్తి ౩౭

**శౌర్యధైర్యసంపన్నులు చాల మంది**
**శీలసంరక్షణమ్మును చేసి కొనుచు**
**నీచసంసర్గ మైనను శౌచు లౌచు**
**వికృతి బొందరు వారు వివేకు లౌట 37.**

మానీ దమ్భీ ద్రోహీ
పరాపవాదీ వికత్థనః పిశునః
బ్రాహ్మణకులేఽపి జాతః
శ్వపాక ఇవ నీచతాం యాతి ౩౮

**మానహీనుడు ద్రోహిగ మసలు వాడు**
**పాపవాక్యముల్ నిరతము పలుకు వాడు**
**పరుల నిందించి జీవించు బాలిశుండు**
**బ్రాహ్మణుం డైనను శునకపాకు డగును. 38.**

మలినాశ్చేతేఽమలినా
యేషాం హృదయాని నిత్యశుద్ధాని
తేఽమలినా అపి మలినా
యేషాం హృదయాని కలుషాని ౩౯

**మలినవంతు లై కొందరు మసల వచ్చు**
**కాని మలినమనస్కులు కారు వారు!**
**మలినరహితు లై కొందరు మసల వచ్చు**
**కాని మలినమనస్కులు కారె వారు? 39**

సత్యార్జవహృదయానాం
కిం వర్జయితవ్యమస్తి సాధూనామ్
యే స్వహృదయానుమానా
త్పరహృదయే యాన్తి విశ్వాసమ్ ౪౦

**సత్యసంపన్ను డై యుండు సజ్జనుండు**
**పరుల పట్లను తన యట్ల భావ ముంచు**
**పరులపై నమ్మక మ్ముంచు, వర్జనీయ**
**మైన దే మేని యుండునె వాని కెపుడు? 40.**

మర్మాస్తః పరిహాసో
యావత్క్రియమాత్తభద్రకృత్త్వం చ
స్మరణం చ దుష్కృతానాం
త్రీణి కుమిత్రస్య చిహ్నాని ౪౧

**పరిహాసించుట నొప్పించి పరుల మనము,**
**అభినయించుట మంచిని అవసరమున,**
**మరి స్మరించుట లోపముల్ మరుగు లేక**
**మూడు గుణము లమిత్రుడౌ మూర్ఖునకును 41.**

బన్ధురివ భవతి పూర్వం
మధ్యే మిత్రమివ శత్రురివ చాన్తే
కృకలాస ఇవ దురాత్మా
త్రీన్ వర్ణాన్దర్శయతి నీచః ౪౨

**ముందు బంధువౌ చందము మోహమూను**
**పిదప మిత్రుడౌ పగిదిని ప్రేమ చూపు**
**కడకు శత్రువౌ కద! దురాత్ముడగువాడు**
**వెల్లి విరియుగా ఊసరవెల్లి వోలె 42.**



గుణవన్తః సమశీలా
విస్రమ్భసుఖోపచారసంభోగాః
సమదుఃఖసుఖాః సుహృదో
రసాయనం జీవలోకస్య ౪౩

**సుగుణవంతులు సౌశీల్యశోభితులును**
**భూరి యుపచారసుఖభాగ్యభోగయుతులు**
**సుఖము దుఃఖముల సములు సుహృదు లైన**
**మిత్రులు రసాయనంబు లై మెలగ గలరు. 43.**

భిన్నశ్లిష్టా ప్రీతి
ర్యద్యుపచారేణ బహుగుణీ భవతి
ఛిన్నవిరూఢేవ లతా
పూర్వచ్ఛాయాం న పూరయతి ౪౪

**విడిన పిమ్మట కూడిన ప్రేమ యయ్యు**
**ఇచ్చి పుచ్చుట జరిగిన హెచ్చ వచ్చు**
**కోసి వేసిన పిమ్మట కొనలు సాగ**
**పూర్వశోభను లతికయు పొంద కున్నె? 44.**

స్నిగ్ధానామశఠానాం
స్థిరసఖ్యానాం మహానుభావానామ్
వ్యసనేషు సహాయానాం
భద్రం కళ్యాణమిత్రాణామ్ ౪౫

**స్నేహశీలుడు శాఠ్యము సేయ లేని**
**వాడు, కార్యసాధకు లైన వారు, కష్ట**
**కాల మందున ఆదుకో జాలు వారు-**
**సేమ మౌ గాక! వారికి శీఘ్రముగను. 45.**

వాఙ్మాత్ర వత్సలానాం
శస్త్రాగ్నివిషప్రఘాతహృదయానామ్
అర్థార్థమాశ్రితానాం
ధిగస్తు బత పాపమిత్రాణామ్ ౪౬

**ఆయుధము రీతి విషమును అగ్ని రీతి**
**మాట లందున మాత్రము మంచి చూపి**
**స్వార్థపరతను చేరగ వచ్చు వారు**
**మాట వరుసకు మిత్రులై మనుట నిజము 46.**

స్వజన ఇవ భవతి నీచ
స్తావద్యావత్స్వకార్యనిష్పత్తిః
కృతకృత్య స్త్వపవృత్తః
ప్రతీకారభయాద్భవతి శత్రుః ౪౭

**స్వజన మను నట్లు వర్తించు కుజను డెపుడు**
**తనకు పరులతో పని యున్నదనుక, వెనుక**
**కామితార్థము తీరిన కాన రాడు**
**సరి, ప్రతీకారభయమున శత్రు వౌను 47.**

ఉపచారః కర్తవ్యో
యావదనుత్పన్నసౌహృదః పురుషః
ఉత్పన్నసౌహృదానా
ముపచారః కైతవం భవతి ౪౮

**ఎంత యుపచార మన్నది యంత వరకె**
**స్నేహభావము పెంపొంద జేయ చాలు,**
**పిదప చేసెడి యుపచారవిధము చూడ**
**పరమకైతవ మది యంచు పరిగణించు 48.**

ధిగ్ధిక్సజ్జనమైత్రీం
దుర్జనసంసర్గ ఏవ నో భవతు
సజ్జనవియోగకాలే
భవన్తి తీవ్రాణి దుఃఖాని ౪౯

**వలదు సజ్జనస్నేహము వలదు మాకు**
**వలయు దుర్జనస్నేహము వలయు మాకు**
**సజ్జనవియోగ మన్నది సహ్య మౌనె?**
**దుర్జనవియోగ మన్నది దుఃఖ మౌనె? 49.**

అల్పాశ్చ గుణాః స్ఫీతా
భవన్తి గుణసముదితేషు పురుషేషు
శ్వేతగిరిశిఖరకేష్వివ
నిశాసు చన్ద్రాంశవః పతితాః ౫౦

**గుణము లల్పము లైనను గొప్ప వౌను**
**మంచి గుణములు గలిగిన మనుజులందు**
**రాత్రి వేళల చంద్రకిరణము లైన**
**గాని, కైలాసగిరి పైన కాంతు లీను 50**

శతమప్యపరాధానాం
సుకృతేనైకేన నాశయత్వార్యః
నాశయతి సుకృతశతమపి
నీచస్త్వేకాపరాధేన ౫౧

**సతము చెడు లెన్ని చేసిన, సజ్జనుండు**
**మంచి చూచిన చెడు లెల్ల మరచి పోవు**
**దొసగు నొక్కటి చేసిన, దుర్జనుండు**
**మంచి పను లెన్ని చేసిన మరచి పోవు** **51**

ఏకసుకృతేన దుష్కృత
శతాని యే నాశయన్తి తే సేవ్యాః
న త్వేకదోషజనితో
యేషాం కోపః కృతశతఘ్నః ౫౨

**మంచి నొక్కట తప్పులు మరచిపోవు**
**నెవడొ, వాడె సుసేవ్యుడై యెసగు నవని**
**దొసగు నొక్కట గుణముల త్రోసి వేసి**
**పగను పూనగ తగ సేవ్యు డగునె భువిని?** **52**

సమరసమవిషమమకుటిల
మవస్థితం తుల్యశీలసామర్థ్యమ్
ఏకమపి మిత్రమచలిత
ముదారమార్యస్య పర్యాప్తమ్ ౫౩

**సమరసము, సమశీలమ్ము, సత్త్వగుణము**
**కుటిలవిషమశీలమ్మును కోపగుణము**
**కలిమిలేము లై నిరతము కలిగి యుండు**
**స్నేహశీలు డొక్కడె చాలు చెలిమి చేయ 53.**

విద్వాన్ ఋజురభిగమ్యో
విదుషి శఠే చాప్రమాదినా భావ్యమ్
మూర్ఖ ఋజవోఽనుకమ్ప్యాః
మూర్ఖశఠాః సర్వదా వర్జ్యాః ౫౪

**శీలవిద్వాంసు డొక్కడె చేర దగును**
**శఠుని యెడ నప్రమత్తుడై సాగదగును**
**జనులు మూర్ఖార్జవులె యైన జాలి తగును**
**విరసమూర్ఖశఠు లెపుడు విడువ దగును 54**

చిరజీవిత్వమనర్థం
కామేర్ష్యాసక్తచేతసాం పుంసామ్
కర్మణ్యసమర్థానాం
పరిభవదుఃఖాగ్నితప్తానామ్ ॥౫౫॥

ఇలను కామంబు నీర్ష్యయు గలుగు వారు
కార్యసాధన నేర్వని వీర్యహీను
లైన వారును పరిభవు లైన వారు
బ్రతుకు చిరముగ సార్థకపరచు టెట్లు? 55

త్యక్తవ్యాస్తే సుహృదో
యే దైవవిపర్యయాగతం మిత్రమ్
వ్యసనార్ణవే నిమగ్నం
స్వస్థా జనవన్నిరీక్షన్తే ॥౫౬॥

ఈశ్వరానుకూల్యము లేక పది కలిసి
రాక సాయంబు నడుగగ రాగ, వాని
నపరిచితు నట్లు చూచుచు నాదుకొనడొ,
విడువ దగు నట్టి మిత్రుని వేగముగను. 56.

సతతప్రసరే విషయే
జితేన్ద్రియత్వం చ యది భవేత్పుంసః
ఇహ చ న మనోభిఘాతః
పరత్ర చ(పరం) సుఖం భవతి.        ౫౭

**విషయభోగముల్ మనుజుడు విడువ దగును**
**వాని నెవడు జయించునో వాడె సతము**
**మనసునకు శాంతి సమకూరి మనును మరియు**
**చూడ నిహలోకపరలోకసుఖము లొందు        57**

హిమవతి తిష్ఠత్యోషధ
ముదధౌ రత్నం విభావసౌ తేజః
వైరమసజ్జనహృదయే
సజ్జనహృదయే సదా క్షాన్తిః .        ౫౮

**ఉదధి రత్నాలకు, హిమాద్రి ఓషధులకు,**
**తేజమున కైన నిరతము దినకరుండు,**
**ఓర్మికి సుమతి, కుమతియె ఓర్వమికిని**
**నిలయములు గాగ నుండుట నిజము నిజము 58**

పాషాణేష్వివ రేఖా
మూర్ఖే వైరం దృఢం చిరం భవతి
జలమధ్యేష్వివ రేఖా
ప్రాజ్ఞే న చిరం భవతి వైరమ్ ౫౯

**మూర్ఖచిత్తుని వైరము మొక్కవోదు**
**రాతి మీదనె గీసిన గీత రీతి**
**సౌమ్యచిత్తుని వైరము సాగ దెపుడు**
**జలము పైన గీసిన గీత నిలువ నట్లు 59.**

పరపరివాదనమూకాః
పరదారనిరీక్షణేషు జాత్యన్ధాః
యే పరరహస్యబధిరా
స్తే పురుషా దేవతాసదృశాః ౬౦

**పరుల నిందింప మూగ యై పరగు నెవడొ**
**పరవనిత గని యంధు డై పరగు నెవడొ**
**పరరహస్యబధిరు డయి పరగు నెవడొ**
**వాడె దేవతాసము డయి పరగు చుండు 60.**

యది తత్త్వేనాక్రోశతి
సోఢవ్యం భవతి తత్త్వమాహేతి
అథ చేన్మిథ్యాభిహితం
క్షన్తవ్యం నైతదస్తీతి. ౬౧

**పరులు మనలను నిందింప వచ్చు గాని,**
**నింద నిజమైన ఓరిమి నొంద దగును**
**పరులు మనలను నిందింప వచ్చె నేని,**
**నిజము కా కున్న పరులపై నింద వలదు 61**

మర్మాణి ఘట్టయిత్వా
సుప్రీతమనాస్తు దుర్జనో భవతి
అప్రియముక్త్వాతిభృశం
పశ్చాత్తపతీహ ఖల్వార్యః ౬౨

**జనుల పీడించి యానంద మనుభవించు**
**సతము కుజనున కయ్యది సహజగుణము**
**జనుల పీడించి పరితాప మనుభవించు**
**సతము సుజనున కియ్యది సహజగుణము 62.**

శ్వా యది దంశతి మనుజా
న్న తే జనాస్తం ప్రతిదశన్తి
యద్యాక్రోశతి నీచో
న సజ్జనస్తం వదతి కిఞ్చిత్ ౬౩

నీచు డాక్రోశ మందుట నేర్చుగాని
మంచివా డెప్డు మౌనము మాన లేడు
కుక్క మనుజుని ముట్టగ కోరవచ్చు
మారు కరవగ మనుజుడు కోర డెపుడు 63.

శ్రేష్ఠం తు భయాత్ క్షమతే
సమం తు లోకాపవాద (తశ్చ) భయాత్
హీనం యస్తు క్షమతే
స మహర్షిసమో నరో జ్ఞేయః ౬౪

క్షమను చూపును పెద్దల సముల యెడల
భయము లోకాపవాదంపు భయము వలన,
ఋషికి తుల్యు డౌ మరి క్షమియించువాడు
నీచమానవు నైనను నేర మనక. 64.

పరుషైరపి చాక్ఛల్యై
ర్మర్మఘ్నైః కోపితా మహాత్మానః
సలిలమివ శరత్కాలే
స్వయమేవార్యాః ప్రసీదన్తి ౬౫

**పరుష వచనాల పీడింప బడిన గాని**
**సుగుణవంతులు సరసులు సుమతియుతులు**
**శాంత చిత్తు లగుదురు తమంత తామె**
**శరదృతువు నందగు విమల సలిల మట్లు. 65.**

ఆక్రుష్టేన మతిమతా
తత్త్వార్థవిచారణే మతిః కార్యా
యది సత్యం కః కోపః
స్యాదనృతం కిం ను కోపేన ౬౬

**నింద నొందగ నాలోచన నంద దగును**
**సత్యమా ఇది? కాక అసత్యమె? అని.**
**శాంతమే సత్యమైన, అసత్యమైన**
**కోప మన్నదే మాత్రము కూడ దెపుడు. 66.**

పనసామ్రపాటలసమాః
స్యురిహోత్తమమధ్యమాధమాః పురుషాః
(ఫలసుమఫలసుమనిచయైః
కర్మవచః కర్మవాఙ్నిచయైః) ౬౭

**పనస మామిడి పాటల మనగ వచ్చు**
**ఉత్తములు మధ్యమాధము లోలి గాగ**
**కార్యశూరులు, వాచకుల్ కార్యశూరు**
**లనగ, కేవలవాక్శూరు లనెడి వారు. 67.**

న భవతి భవతి చ న చిరం
భవతి చిరం చేత్ఫలే న సంభవతి
కోపః సత్పురుషాణాం
తుల్యః స్నేహేన నీచానామ్ ౬౮

**కోపమో రాదు, వచ్చిన కోప మైన**
**శూన్యఫల మిచ్చు, నిలువదు సుజనులందు**
**కుజనులందు స్నేహ మిటుల కుదిరి యుండు,**
**సజ్జనకుజనపథముల సామ్య మిట్లు 68.**

నీచజనజనితమన్యుః
క్రుద్ధోఽపి న విప్రియం వదత్యార్యః
న హి రాహువదనదష్ట
శ్చన్ద్రశ్శైత్యం పరిత్యజతి ౬౯

**కుజనువలన తా నెంతగ కోప మంద**
**శాంతమును వీడ డెప్పుడు సత్పురుషుడు,**
**రాహువదనంబు బడి వికారంబు నొంద**
**చల్లదనమును వీడునె చంద్రు డెపుడు?** 69.

యత్కుపితాః ఖల భుజగాః
పరమర్మఘ్నం క్షరన్తి వాక్యవిషమ్
తచ్ఛాన్తిమయైరగదై
ర్విషమివ సన్తః ప్రశమయన్తి ౭౦

**కుజనభుజగముల్ పరులపై కోప మూని**
**వెరపు లేక వాగ్విషమును వెడల జేయ,**
**శాంతి యోషధి నా వాగ్విషంబు నైన**
**శాంతి నొందింప దలతురు సత్పురుషులు** 70.

ఆలస్యం త్యక్తవ్యం
లౌల్యం లోభః పరాపవాదశ్చ
అస్థానేషు చ కోప
స్తథాతిమానశ్చ పురుషేణ ౭౧

**సోమరితనంబు, చపలత, కామపరత,**
**పరుల నిందింప నిరతము ప్రాకులాట,**
**గర్వ కోపముల్, పాపముల్, కరుణలేమి-**
**వీని నేవేళ సుజనుడు విడువ దగును 71.**

విద్వాన్ ఋజుః ప్రధానో
విద్వాంశ్చ శఠశ్చ మధ్యమః పురుషః
మూర్ఖఋజుశ్చ తృతీయ
స్సర్వజఘన్యస్తు మూర్ఖశఠః ౭౨

**ప్రథము డార్జవవాది యౌ పండితుండు**
**శాఠ్యపండితుడు ద్వితీయజాతివాడు**
**మూడవ మనుజు డార్జవ మూర్ఖు డౌను**
**శాఠ్యమూర్ఖుడు నాల్గవ జాతివాడు 72**

సుజనో న యాతి వైరం
పరహితబుద్ధిర్వినాశకాలేఽపి
ఛేఽదేపి చన్దనతరు
స్సురభయతి ముఖం కుఠారస్య ౭౩

సజ్జనుడు తన కాపద సమయమునను
వైర మూనుట నెరుగని వాడు గాదె!
చందనతరువు ఛేదించు సమయమునను
గొడ్డలికిని వాసన నొడ గూర్చు రీతి 73.

అభిముఖమధురతరేభ్యః
పరాఙ్ముఖాక్రోశనాత్కుశీలేభ్యః
అభ్యన్తరకలుషేభ్యో
భేతవ్యం మిత్రశత్రుభ్యః ౭౪

ఎదుట మధురవాక్యంబుల నింపు బలికి
వెనుక నిందలు వేయుచు వెతల గూర్చి
పాడు పనులకు నెపుడు పాల్పడెడు వారు
మిత్రు లయ్యు భేతవ్యులు శత్రు లట్లు 74.

న చ హసతి నాభ్యసూయతి
న పరాన్ పరిభవతి నానృతం వదతి
నాక్షిప్య కథాం కథయతి
లక్షణమేతత్కులీనస్య ౭౫

ఎవని జూచియు నవ్వక ఈర్ష్యపడక
పరిహసింపక అనృతము పలుక కుండి
పరిభవింపక నాటంకపరుప కుండు
నాతడె కులీను డన దగి ఖ్యాతి గాంచు 75.

పశ్యతి దీర్ఘం కృత్యం
పీడాం సహతే పరం న పీడయతి
అవమన్యతే న కఞ్చి
ల్లక్షణమేతత్కులీనస్య ౭౬

పనిని గూర్చి దీర్ఘమ్ముగ పారజూచు,
పరుల బాధింప నేర్వడు బాధనోర్చు,
పరిభవించుట ఎరుగడు పరుల నెపుడు
ఇవి కులీన గుణము లని ఎరుగ వలయు 76.

కులశీలవృత్తదోషాన్
విద్యాదోషాంశ్చ కర్మదోషాంశ్చ
కథయతి పరస్య నీచో
న తు స్మరత్యాత్మనో దోషాన్ ౭౭

**కులనుగూర్చియు, శీలంబుగూర్చి, వృత్తి**
**గూర్చి, విద్యనుగూర్చియు కుజను డెపుడు**
**పరులదోషముల్ తడయు కేకరువు బెట్టు**
**తనదు దోషమ్ముల నెపుడు దాచి యుంచు 77.**

చిరజీవిత్వమనర్థః
పురుషస్యాధర్మచారిణో భవతి
చిరజీవిత్వం సఫలం
భవతి హి ధర్మైకనిరతస్య ౭౮

**ధర్మ విరహితు డై నట్టి కర్మపరుడు**
**జీవితము సార్థకమ్ముగ జేయలేడు**
**ధర్మనిరతుడై యుండెడి కర్మపరుడు**
**జీవితము సార్థకమ్ముగ జేసికొనును 78.**

జ్ఞానాఢ్యమలోకజ్ఞం
కృపణం ధనినం దరి(ద్రమభిజాతమ్
గుణవన్తం (శుతహీనం
కస్మాత్ కృతవాన్ కృతాన్తః సః ౭౯

**జ్ఞాని చూడ లోకజ్ఞానహీను డౌట,**
**అర్థవంతుడు లోభిగ, వ్యర్థు డౌట**
**అరయ నభిజాతు డైనను అధను డగుట**
**సుగుణవంతుడై శ్రుతహీను డగుట చూడ**
**దేవు డీరీతి చేయుట దేని కొరకో! 79.**

ఏతావదేవ హి ఫలం
పర్యాప్తం జ్ఞానసత్త్వయుక్తస్య
యద్వ్యాపత్సు న ముహ్యతి
నాభ్యుదయే విస్మితో భవతి ౮౦

**ఆపదలు గల్గ కుంగక నాగవలయు,**
**సంపదలు గల్గ పొంగక సాగవలయు**
**జ్ఞానబలమును పొందిన దాని ఫలము**
**ఇంతకును మించి మరియు నిం కేమి యుండు? 80.**

నీచేషు కార్యయుక్తిః
సాధుప్రణయ క్రియాసు చాశక్తిః
సహవాసశ్చానార్యై
రార్యస్య గురూణి దుఃఖాని ౮౧

**కాపురుషులతో తప్పని కార్యయుక్తి**
**సత్పురుషులతో చాలని చాతురియును**
**చెడ్డవారలతో జేయు చెలిమి గూడ**
**దుర్భరం బైన సుజనుని దుఃఖము లివి. 81.**

యః ఖలు బహువిధదోషం
మిత్రం పాలయతి స ఖలు పాలయతి
న హి పరిపాలనకృత్యం
గుణవతి మిత్రే భవతి కిఞ్చిత్ ౮౨

**ఎన్నిదోషముల్ మిత్రునం దున్నగాని**
**రక్ష చేసెడు వాడె యౌ రక్షకుండు,**
**అన్నిగుణములు మిత్రునం దున్నయెడల**
**రక్ష చేసెడి పని యేమి రాక యుండు 82.**

కృత్వా జగత్ప్రకాశం
ప్రీతిం సర్వాత్మనా మనుష్యేణ
విషమరసాన్యపి సుహృదాం
శీలాన్యనువర్తనీయాని ౮౩

**స్నేహమును లోక మెరుగగ చేసి చేసి**
**పిదప నచ్చక పోయిన వేరు చేసి**
**వాదు పెట్టుకొన దగదు వారి తోడ**
**చెలిమి తప్పదు కావున చేయ దగును.** **83.**

అభిగమ్యాస్తే సద్భి
ర్వ్యపగతమానావమానదోషాశ్చ
యే స్వగృహముపగతానాం
శ్రమముపచారైర్వ్యపనయన్తి ౮౪

**ఎవరు లేశమ్ము దోషమ్ము నెరుగ కుండి**
**ఇంటి కేతెంచి నట్టి వా రెవ్వ రేని**
**మానమర్యాద లేవియు మాననట్టి**
**వారొ, అభిగమ్యు లన దగు వారు వారె!** **84.**

ఐశ్వర్యమల్పమేత్య
ప్రాయేణ హి దుర్జనో భవతి మానీ
సుమహత్ప్రాప్యైశ్వర్యం
ప్రశమం ప్రతిపద్యతే సుజనః  ౮౫

**కలిమి కొంచెము మాత్రము కలిగెనేని**
**పట్ట పగ్గము లుండవు బాలిశునకు**
**కలిమి బలిమిని విరివిగ కలిగి యున్న**
**మీదు మిక్కిలి సుజనుడు మిడిసి పడడు  85**

సత్యవచనవృత్తానాం
శీలజటాశౌచవల్కలధరాణామ్
సన్తోషాభిరతానాం
కిమాశ్రమైః కార్యమార్యాణామ్ ౮౬

**సత్యవచనప్రవృత్తులు సతము గలిగి**
**శీలజటలును శౌచవస్త్రాలు గలిగి**
**నిత్యనిరుపమసంతోషనిరతు లైన**
**ఆశ్రమంబుల బని యేమి? ఆర్యులకును.  86.**

విద్ధత్త్వే యతితవ్యం
నార్థేష్వేవాదరః సదా కార్యః
అర్థః సర్వజనగతో
విద్వత్తా దుర్లభా లోకే ౮౭

**అర్థసంచయ మొక్కటె వ్యర్థ మగును**
**విద్యసంచయం బొసగూర్చు సద్యశంబు**
**విత్త మన్నది సులభంబు విద్య కాదు**
**విద్య ధన మౌను! విత్తము విద్య యౌనె? 87.**

యస్మిన్న బాష్పమోక్షో
నాపి రహస్యం న చ ప్రణయజాతమ్
తన్మిత్రం త్యక్తవ్యం
శ్రమేణ కిం న్స్వర్థహీనేన ౮౮

**ఎవని యెడ బాష్పమోక్షణ మేమి లేదొ,**
**ఎవని యెడ గుట్టు ర ట్టగు టెట్టు లేదొ,**
**ఎవని యెడ ప్రేమ యన్నది ఇంపు గాదొ,**
**వాని విడువంగ వలయును వ్యర్థ మగుట. 88.**

దారైశ్చ సన్నికర్షో
హతదోషతయా గృహప్రవేశశ్చ
యస్య త్వశఙ్కనీయో
పర్యాప్తం భవతి తన్మిత్రమ్ ౮౯

**ఎవనియందున దోషంబు లేమి లేవొ,**
**ఇంటి కేగిన మాటాడ నింతితోడ,**
**ఎవని శంకింప వలసిన దేమి లేదొ,**
**అట్టి శీలమిత్రుం డొక్కడైన చాలు 89.**

పక్షద్వయశశిసదృశా
న్యనిశం హార్దాని సదసతాం లోకే
ఆప్యాయన్తే తు సతా
మసతాం చ పరిక్షయం యాన్తి ౯౦

**సుజనకుజనుల స్నేహముల్ శుక్లకృష్ణ**
**పక్షచంద్రుల చంద్రిక పగిది నుండు**
**పెరుగుచుండును వెన్నెల తరుగు లేక**
**తరుగుచుండును వెన్నెల తిరుగు లేక 90.**

సత్సఙ్గమస్య నార్ఘః
కర్తుం భవతీతి మే మతిర్భవతి
యత్తద్వియోగదుఃఖం
తదేవ మూల్యం భవతి తస్య　　　౯౧

మంచి చెలిమికి మించునె కాంచనంబు?
వెలను కట్టగ లేనిది చెలిమి యెకటె!
చెలిమి కాండ్రకు నెడబాటు కలిగె నేని
అదియె దానికి మూల్యమై మదిని కలచు　　　91.

తే మూర్ఖా మూర్ఖతమా
యేషాం ధనమస్తి నాస్తి చ త్యాగః
కేవలమార్జనరక్షణ
వియోగదుఃఖాన్యనుభవన్తి　　　౯౨

ధనము కలిగియు పురుషుడు దానహీను
డైన, వాడు పరమమూర్ఖు డౌను, వాని
తోడు సంచయరక్షణదుర్వియోగ
దుఃఖములె కాని; యశము తోడు కాదు　　　92.

గుణకలశైః స్నాతానాం
వినయవిలేపనవిలిప్తగాత్రాణామ్
విద్యావిభూషితానాం
కిమలఙ్కారైః కులీనానామ్ ౯౩

**సరససద్గుణకలశాల స్నాన మాడి**
**అచ్చు వినయవిలేపన మాచరించి**
**విద్యలను భూషణంబుల వేడ్కదాల్చ**
**సొమ్ముల బరువు లిం కేల? వమ్ము సుమ్ము! 93.**

బహ్వపి తత్త్వం జ్ఞాత్వా
నృషు బహుమానే ప్రవర్తమానేన
బలవత్తరేణ విదుషా
లోకజ్ఞానే ప్రయతితవ్యమ్ ౯౪

**దండిగ తనకు పాండిత్యముండ వచ్చు**
**పారమార్థికతత్త్వంబు బడయ వచ్చు**
**కాని బహుమాన మన ననుమాన మేల?**
**కావలయు లౌకిక జ్ఞాన కౌశలంబు! 94.**

తత్కష్టం యద్విద్వా
న్విద్యాపారజ్ఞతోఽపి యత్నేన
విజ్ఞాతారమవిన్దన్
భవతి సమః ప్రాకృతజనేన ౯౫

పార మంటగ వచ్చును పండితుండు
అయిన నయ్యది సార్థక మగుట ఎట్లు?
పలుకుబడిని బడయు కున్న ప్రాకృతుండె!
ఇంత కంటెను కష్టంబు నెంచగలమె? 95

న హి వక్తా మృదువక్తా
విమృశ్యవక్తా న చాపి బహువక్తా
ఋతవక్తా గుణవక్తా
హితవక్తా దుర్లభః పురుషః ౯౬

వక్త, మృదువక్త, మరి బహువక్త ఇంక
భువి విమృశ్యవక్తయు సులభు లగువారు
సతము హితవక్త, గుణవక్త, సత్యవక్త
లైన మనుజులు దుర్లభు లైన వారు. 96

ప్రతివాదినీ చ భార్యా
పరసేవా పరగృహే సదా భుక్తిః
క్షిప్రం జరయతి పురుషం
నీచైర్వాసః ప్రవాసశ్చ ౯౭

**సతము ప్రతివాది యౌ నాతి, ఇతరు నింటి**
**తిండి, పరుల పంచన బడియుండుటయును**
**దుష్టజనసహవాసము తోడు గాగ**
**పురుషు డగును త్వరితముగ ముసలివాడు 97**

ఉపకృతవతాప్యనార్యే
నాశ్వసితవ్యం కృతప్రియోఽస్మీతి
పయసాపి సిక్తమూలో
భవతి హి మధురో న పిచుమన్దః ౯౮

**ప్రియము పొందగ వచ్చును ప్రేమ మీర**
**ఐన నైజము వీడ డనార్యు డెపుడు**
**మంచి తియ్యని పాలతో పెంచె నేని**
**తీపి కాయల నిచ్చునె వేపచెట్టు? 98**

యో న దదాతి న భుఙ్క్తే
విభవే సతి నైవ తస్య తద్ద్రవ్యమ్
తృణకృతకృత్రిమపురుషో
రక్షతి సస్యం పరస్యార్థే ౯౯

తాను తినకయు పెట్టక దాచెనేని
వైభవం బెంత యున్నను పరుల పాలె
కాచు నేవేళ పంటను గడ్డి బొమ్మ
ఎవరి కొరకు? దాని కొరకె? ఎవరి కొరకొ! 99

స్వల్పాపి సాధుసమ్ప
ద్భోగ్యా మహతాం న పృథ్వ్యపి ఖలశ్రీః
సారసమేవ పయస్తృష
మపనయతి న యాదసాం పత్యుః ౧౦౦

సాధుసంపద స్వల్పము సార్థకమ్ము
దుష్టసంపద ఎంతేని తోడు పడదు
సరసి దప్పిక తీర్చగ చాలు గాని
సాగరంబు మాత్రము గాదు సమ్మతమ్ము. 100.

అతికుపితా అపి సుజనా
యోగేన మృదూ భవన్తి న తు నీచాః
హేమ్నః కఠినస్యాపి
ద్రవణోపాయోఽస్తి న తు తృణానామ్ . ౧౦౧

**సాధుజనముల కోపమ్ము శాంతి నొందు**
**దుష్టజనముల కయ్యది కష్టతరము**
**గట్టి బంగార మైనను కరుగు గాని**
**కరుగ గలుగునె మెత్త నౌ గడ్డిపరక 101**

దోషమపి గుణవతి జనే
దృష్ట్వా గుణరాగిణో న ఖిద్యన్తే
ప్రీత్యైవ శశిని పతితం
పశ్యతి లోకః కలఙ్కమపి ౧౦౨

**లోప మొక్కటి సజ్జనులోన నున్న**
**తప్పు పట్టరు గుణములు గొప్ప వైన**
**వంక బెట్టగ లేరు కళంక మున్న**
**చల్లదనమును వర్ణించు చంద్రు నెవరు 102**



గుణీని గుణజ్ఞో రమతే
నో గుణహీనస్య గుణిని పరితోషః
అలిరేతి వనాత్కమలం
న దుర్దురస్త్వేకవాసోఽ పి ౧౦౩

**సుగుణవంతుడె గుర్తించు సుగణనిధిని**
**ఇతరు లే రీతి మెచ్చుదు రతని గుణము?**
**తుమ్మెదలె యెంత దవ్వైన తమ్మి జేరు**
**చెంత నున్నను కప్పలు చేర లేవు 103**

అణ్వపి గుణాయ గుణినాం
మహదపి దోషాయ దోషిణాం సుకృతమ్
తృణమపి దుగ్ధాయ గవాం
దుగ్ధమపి విషాయ సర్పాణామ్ ౧౦౪

**కొంచె మైనను గుణులకు గొప్ప దౌను**
**అధిక మైనను అల్పుల కల్ప మౌను**
**గోవులకు గడ్డి క్షీరమ్ము కొరకు కాగ**
**పాములకు విషము కొరకె పాలు కూడ 104.**

ఉపకృతిరేవ ఖలానాం
దోషస్య గరీయసో భవతి హేతుః
అనుకూలాచరణేన హి
కుప్యన్తి వ్యాధయోఽత్యర్థమ్ ౧౦౫

**ఖలున కుపకార మెంతగ కలుగ జేయ**
**నాత డపకారమే చేయు నాగ్రహించి**
**వ్యాధి కనుకూల మౌ రీతి నాచరింప**
**ముదురునే గాని రోగము కుదురు టెట్లు? 105**

పరవాదే దశవదనః
పరరన్ధ్రనిరీక్షణే సహస్రాక్షః
సద్వృత్త విత్త హరణే
బాహుసహస్రార్జునో నీచః ౧౦౬

**దశవదనములతోడ వాద మొనరించు**
**వేయి కన్నుల తోడ తా వెదకు తప్పు**
**వేయి బాహుల తోడ తా విత్త మెత్తు**
**వాడె పరమనీచుం డన బరగు వాడు. 106**

లబ్ధోదయః ఖలజనః
ప్రథమం స్వజనే కరోతి సన్తాపమ్
ఉద్గచ్ఛన్దవదహనో
జన్మభువం దారు నిర్దహతి          ౧౦౭

**అందె వేసిన వాడైన సందు దొరక**
**తోడి వాడని చూడక కీడు చేయు**
**వనము నందున ముందుగ జనన మంది**
**కారుచిచ్చు, పుట్టిన చోటు కాల్చివేయు.          107**

సహవసతామప్యసతాం
జలరుహజలవద్భవత్యసంశ్లేషః
దూరేఽపి సతాం వసతాం
ప్రీతిః కుముదేన్దువద్భవతి          ౧౦౮

**కుజను లెంతగ నిరతము కూడి యున్న**
**నీరనీరజముల కున్న నీతి బోలు**
**దూర మున్నను సుజనులు కారు వేరు**
**కలువ చంద్రుడు కలిసిన చెలిమి వోలె          108**

అతిసత్కృతా అపి శరా
స్నహభువముజ్ఝన్తి జాతు న ప్రకృతిమ్
శిరసా మహేశ్వరేణా
పి నను ధృతో వక్ర ఏవ శశీ ౧౦౯

**తమకు సమ్మాన మెంతగ నమరి యున్న**
**శఠుడు విడువడు తనదైన సహజగుణము**
**శంకరుని జటాజూటమ్ము వంక జేరి**
**వంకరను వీడునే? నెలవంక యెపుడు 109.**

అఫలం శ్రాద్ధమపాత్రే
ధనమఫలం యన్నధత్తమర్థిభ్యః
యౌవనమఫలం యమినః
శ్రుతమఫలం దుర్వినీతస్య ౧౧౦

**శ్రద్ధలేని వాని కిడిన శ్రాద్ధ మనగ**
**ఈగి లేనట్టి వారల భోగ మనగ**
**యముల విషయముల గలుగు యవ్వన మన**
**అఫల మఫలమును సతత మఫల మగును 110**

నిర్గుణమప్యనురక్తం
ప్రాయో న సమాశ్రితం జహతి సన్తః
సహవృద్ధిక్షయభాజం
వహతి శశాఙ్కః కలఙ్కమపి ౧౧౧

**ఆశ్రితుడు గుణవిరహితు డైన గాని**
**వాని విడువడు సద్గుణవంతు డెపుడు**
**అదియు వృద్ధిక్షయకళంక మైన గాని**
**దాని విడుచునె? అమృతాంశు డైన గాని. 111.**

పరమర్మఘట్టనాదౌ
ఖలస్య యత్కౌశలం న తత్సాధోః
ఛిద్రం కరోతి సూచీ
తథా పిధత్తే సదా తన్తుః ౧౧౨

**పరుల లోపాలె చూపును పాపి యెపుడు**
**సాధు వెప్పుడు వానిని సవర జేయు**
**సూది చేయును రంధ్రము సులభముగను**
**దార మది కప్పి వేయును దానివెంట. 112**

కటురటతి నికటవర్తీ
వాచాటష్టిట్టిభో యతస్తస్మాత్
అపసరణమేవ యుక్తం
మౌనం వా రాజహంసస్య.  ౧౧౩

**కూయు చుండును తీతువు కోప మొదవ**
**చెవులు చిల్లులు పడు నట్లు చెంత చేరి**
**తాను దూర మేగుటొ, మౌన మూనుటయునొ**
**హంస కొక్కటె కర్తవ్య మనగ దగును.  113.**

ఆరోగ్యం విద్వత్తా
సజ్జనమైత్రీ మహాకులే జన్మ
స్వాధీనతా చ పుంసాం
మహదైశ్వర్యం వినాప్యర్థైః  ౧౧౪

**పాండితియును, ఆరోగ్యమ్ము, దండనుండు**
**సజ్జనుల మైత్రి, సద్వంశ జన్మమనగ,**
**సతము స్వాధీన జీవన సౌఖ్యములును**
**పురుషులకును భాగ్యమ్ములై పరగు చుండు  114**

# అనుబంధము

యత్కిఞ్చన ప్రలాపీ
పరమర్మకుతూహలో విగతలజ్జః
సర్వక్రియాసు శక్తః
భవతి చ పరిప్లావో మూర్ఖః ౧

బాగు నోగును లేకుండ వాగు వాడు,
పరుల లోపంబు లెత్తెడి పాతకుండు,
నీచకార్యంబు లన్నియు నేర్చువాడు
చంచలం బైన మూర్ఖుడు వంచకుండు. 1.

వ్యపనీతదైన్యహర్షో
విజ్ఞాతజ్ఞానరత్నసమ్పన్నః
గామ్భీర్యధైర్యయుక్తో
మహాసముద్రోపమః ప్రాజ్ఞః ౨

దైన్యహర్షంబులకు నెల్ల అన్యుడతడు,
ధైర్యగాంభీర్యముల కెల్ల స్థాన మతడు,
ఎన్న విజ్ఞానరత్నసంపన్నుడతడు,
వాడె సాగరసము డైన ప్రాజ్ఞు డనగ! 2.

అశఠహృదయః కృతజ్ఞః
సానుక్రోశః స్థితః సతాం మార్గే
అపరాపవాదకర్మా
శుచికర్మరతః స ఖల్వార్యః ౩

**శాఠ్య రహితుడు, సాధువు, సానుభూతి**
**మతియు మరియు కృతజ్ఞుడు, హితకరుండు,**
**సాధుమార్గాను గామియు, సౌమ్యమూర్తి,**
**అన్యనిందకు దూరస్థు డార్యు డతడె. 3.**

సత్యసతి చాపి విభవే
మాన్యాన్మానయతి పూజయత్యతిథీన్
మిత్రేషు వినిహితాత్మా
చారిత్రాఢ్యః స ఖలు సాధుః ౪

**కలిమి కలిగిన లేకున్న గౌరవించు,**
**అతిథి పూజించు, నతిభక్తి నాదరించు,**
**మిత్రులను జూచు ప్రేమగ, మైత్రి సలుపు,**
**సచ్చరిత్ర మైశ్వర్యమౌ సాధు వతడె! 4.**

శ్రుతసజ్ఞ్చయాద్వినీతో
జ్ఞానేన నిసర్గతః సతాం మార్గే
కథయతి పరిషది యుక్తం
విచారదక్షః స ఖలు విద్వాన్ ౫

శాస్త్రపాండిత్యసంపద చాలగల్గి,
సత్పురుషమార్గ మందున సంచరించు,
మాన్యమౌ రీతి సభలను మాటలాడు,
వాడె విద్వాంసు డన దగు వసుధ మీద. 5.

లజ్జతి దీర్ఘం పశ్యతి
సహతే పీడాం పరాన్న పీడయతి
అవమన్యతే న కఞ్చి
ల్లక్షణమేతత్కులీనస్య ౬

ఎగ్గు సేయుట యన్నను సిగ్గు పడును
దీర్ఘముగ విచారించును దేనినేని
పరుల పీడింప డోర్చును పరుల బాధ
అతడె సద్వంశజాతుడై యశము నొందు 6.

యో వేత్తి పురుషసారం
జ్ఞానైర్యుక్తః కృతం న నాశయతి
అపరాధానపి మృషతే
సానుక్రోశః స ఖలు సేవ్యః ౭

**పురుషసారంబు గ్రహియించు పురుషు డెవడొ,**
**ఎవడు పండితుం డగు వాడొ, యెవడు పరుల**
**తప్పు లెల్ల మన్నించునొ దయను గలిగి,**
**వాడె పరులకు సేవ్యుడై పరగు చుండు. 7.**

అలముదకేన తృణైర్వా
మనస్వినా ప్రాణధారణా కార్యా.
నాసంస్కృతశ్చ పురుషః
ప్రాకృతసత్త్వః ప్రణయితవ్యః ౮

**ప్రాణధారణ చేయును మానసీయు**
**డాకు అలముల జలముల నంతె కాని,**
**హీనసంస్కారవంతుని హేయబుద్ధి**
**యైన వానిని స్తుతియింప నైన లేదు 8.**

లోకస్తుష్యతు మా వా
స్వకార్యనిష్పత్తయే ప్రయతితవ్యమ్
లోకప్రతీక్షణపరో
నరో న కృతకృత్యతాం యాతి

మెచ్చుకొన్నను లోకంబు మెచ్చకున్న
తన పనిని తాను చేయుట తప్పుకాదు
పరుల గూర్చి యాలోచన పనికిరాదు
కార్యసాధన మొక్కటే కార్యమౌను 9.

సన్తుష్టేనాత్మవతా
సమదుఃఖసుఖేన నిశ్చితార్థేన
లోకః సుఖం ప్రవిష్టః
సుఖావమానాతిమానేన ౧౦

సుఖము నసుఖము సమముగ జూచువాడు,
నిత్యసంతుష్టి, సంయమి, నిశ్చితార్థి,
సమయవిజ్ఞానశీలుడు, సౌమ్యవర్తి
అట్టివాడు సుఖము నందు ననుట నిజము. 10.

కాఠిన్యం గిరిషు సదా
మృదుతా సలిలే ధ్రువా ప్రభా సూర్యే
వైరమసజ్జనహృదయే
సజ్జనహృదయే పునః క్షాన్తిః ౧౧

**రశ్మి యుండును రవియందు, రాతియందు**
**కఠినత, జలముల మృదుత, కాపురుషుని**
**యందు వైరము, సుజనుని యందు క్షాంతి**
**సత్యవిషయాలు లోకాన నిత్యములును 11.**

అప్రియవచనాగ్నిదగ్ధై
ర్దగ్ధోపి న విప్రియం వదత్యార్యః
కిం దహ్యమానమగరు
స్వభావసురభిం పరిత్యజతి. ౧౨

**పరుషవచనాగ్నిదగ్ధుడై బాధ పడిన**
**విప్రియంబుల పలుకంగ వెరచు సుమతి**
**అరణి యగరును దహియించు తరుణమందు**
**కూడ స్వీయపరిమళము వీడనట్లు 12.**

దూరేఽపి పరస్యాగసి
పటుర్జనో ఽత్మనః సమీపేఽపి
స్వం వ్రణమక్షి న పశ్యతి
శశిని కలఙ్కం నిరూపయతి. ౧౩

తనదు తప్పును కప్పును మనుజు డెపుడు
పరుల లోపంబు జూపగ పరితపించు
కన్ను తనలోని మచ్చను కాంచ లేదు
కాని చంద్రుని మచ్చను కాంచగలుగు, 13.

అపకారిణి కోపశ్చేత్
కోపే కోపః కథం న జాయేత
ధర్మార్థకామమోక్ష
ప్రాణయశోహారిణి క్రూరే ౧౪

క్రోధకారణ మది యపరాధ మౌను,
కనుక కోపమే గద! కోపకారణ మన
నాల్గు పురుషార్థములు గూడ నాశ మొంద,
క్రూర మైనది తగనిది క్రోధ మొకటె 14.

మిత్రమపి యాతి రిపుతాం
స్వస్థానాత్ప్రచ్యుతస్య పురుషస్య
కమలం జలాదపేతం
శోషయతి రవిర్న తోషయతి. ౧౪

**స్థానచలనమ్ము గలిగిన మానవునకు**
**మిత్రుడైనను పిమ్మట శత్రువౌను**
**నీట బాసిన తోడనే నీటు బాసి**
**కమలములు గూడ రవివల్ల కమలి పోవె! 15.**

అతిపరిచయాదవజ్ఞా
భవతి విశిష్టేఽపి వస్తుని ప్రాయః
లోకః ప్రయాగవాసీ
కూపస్నానం సమాచరతి. ౧౬

**అతిపరిచయమ్ము కలిగించు నౌ నవజ్ఞ**
**విజ్ఞునకు నైన కా కున్న నజ్ఞు కైన**
**పరగగ ప్రయాగ వాసులౌ ప్రజలు కూడ**
**కూపజలముల స్నానము కోరునట్లు. 16.**

తత్క్షణమపి నిష్క్రాన్తాః
కృతదోషా ఇవ వినాపి దోషేణ
ప్రవిశన్తి శఙ్కమానా
రాజకులం ప్రాయశో భృత్యాః ౧౭

వడిగ తా రాజగృహమును వెడలి యున్న
మలసి దాని ప్రవేశింప వలసి యున్న
లేశ మైనను దోషమ్ము లేక యున్న
సంశయమ్ము భృత్యుల కుంట సహజ మౌను. 17.

ప్రణమత్యున్నతిహేతో
ర్జీవనహేతోర్విముఞ్చతి ప్రాణాన్
దుఃఖీ యతి సుఖహేతోః
కో మూఢః సేవకాదపరః ౧౮

తాను ప్రణమిల్లు నున్నతి నాను కొరకు
విడుచు ప్రాణముల్ తాను జీవించు కొరకు
ఇష్టపడు దుఃఖమును సుఖియించుకొరకు
మూఢు డెవ్వడు సేవక మూర్ఖు కంటె 18.

గన్తవ్యం రాజగృహం
ద్రష్టవ్యా రాజసమ్మతాః పురుషాః
యద్యపి న భవన్త్యర్థాః
భవన్త్యర్థప్రతీకారాః ౧౯

చేరవచ్చును పెద్దల చెంత కైన,
మాట లాడగ వచ్చు మొమాట పడక
దాన, లాభంబు లేకున్న తనకు నష్ట
మన్నది కలుగ కుండుట యైన నిజము 19.

సుహృది నిరన్తరచిత్తే
గుణవతి భృత్యే ప్రియాసు నారీషు
స్వామిని శక్తిసమేతే
నివేద్య దుఃఖం సుఖీ భవతి ౨౦

స్నేహితులకో, మరియు మంచి సేవకులకొ,
స్వామికో, కాక ఆప్తులౌ వనితలకునొ,
కష్టసుఖముల తీరును స్పష్టపరుప
గుప్పెడంతైన మనసుకు ముప్పు దప్పు 20.

ప్రాప్య చలానధికారాన్
శత్రుషు మిత్రేషు బన్ధువర్గేషు
నాపకృతం నోపకృతం
న సత్కృతం కిం కృతం తేన॥

పదవి పొందుట దుర్లభ మదియు పొంది
శత్రులకు తగు శాస్తియు మిత్రులకును
మేలు చేయక యుండిన చాలు నింక
పదవి పొందిన దానికి ఫలిత మేమి? 21.

అవిధేయో భృత్యజనః
శఠాని మిత్రాణి నిర్దయః స్వామీ
వినయరహితా చ భార్యా
మస్తకశూలాని చత్వారి ॥

సేవ చేయక తొలగెడి సేవకులును
స్నేహ ధర్మము తెలియని స్నేహితులును
సౌమ్యభావము నెరుగని స్వామి యనగ
బాధ పెట్టుచు తనిసెడి భార్య యనగ
నాల్గు తలనొప్పు లనదగు నరుని కెపుడు. 22.

కులజోఽయం గుణవానితి
విశ్వాసో న క్షమః ఖలప్రకృతౌ
నను మలయచన్దనాదపి
సముత్థితోఽగ్నిర్దహత్యేవ ౨౩

మంచి వంశమున ప్రభవించి యున్న
ఖలుని నమ్మి యుండుట కేమొ వలనుపడదు
జనన మందిన మలయచందనము నందు
తగుల బెట్టుట అగ్నికి తగిన గుణము 23.

అప్రతిబుద్ధే శ్రోతరి
వక్తృత్వమనర్థం పుంసామ్
నేత్రవిహీనేస్వామిని
లావణ్యమనర్థకం స్త్రీణామ్ ౨౪

పెడ మొగం బెడె నేనియు వినెడివాడు
మాట లాడుట వ్యర్థము మౌన మౌను
గుడ్డి భర్తను తగ కట్టుకొన్న ఇంతి
అంద మంతయు వ్యర్థ మౌ చందముగను. 24

విగతజ్వరమివ హృదయం
గాత్రం లఘుతరమివావసితభారమ్
తీర్ణార్ణవస్య చ సుఖం
మనో భవత్యవసితప్రతిజ్ఞస్య ౨౫

ప్రతిన బూనుట తీర్చుట సతము తనకు
సాగరంబును తరియించు లాగు నుండు
జ్వరము తీరిన తీరుగ భరము తీరి
మనము గాత్రము హాయిగ మనుట నిజము 25.

ధనినోఽప్యదాననిరతా
వర్ణ్యన్తే ధురి మహాదరిద్రాణామ్
హన్తి న యతః పిపాసా
మతః సముద్రోఽపి మరురేవ ౨౬

ఈవి యెరుగని ధనికు డౌ జీవి యైన
వాడు భువి దరిద్రు డనగ బరగు చుండు
దప్పి తీర్పగ లేని సంద్రమ్ము గూడ
అది యెడారి కాక జడధి యగుట యెట్లు? 26.

సేవేన మానమఖిలం
జ్యోత్స్నేవ తమో జరేప లావణ్యమ్
హరిహరకథేవ దురితం
గుణశతమప్యర్థితా హరతి ౨౭

**మానమును సేవ, చీకటి నైన వెన్నె**
**లయును, చెలువమును ముదిమి లక్షణమ్ము,**
**హరిహరకథయు పాపంబు నట్లు, యాచ**
**నమ్ము గుణముల నన్నిటి నాహరించు 27.**

మాయావినియమవిభ్రమ
నిహ్నవవైచిత్ర్యకూటకపటానామ్
సఞ్చయదుర్గపిశాచః
సర్వహరో మూలకారణం లోభః ౨౮

**మాయ వినిమయమ్మును విభ్రమమ్మును మరి**
**మోసమును సత్యరాహిత్యమును గలిగియు**
**భూత మన దగు లోభమ్ము నీతి మాలు**
**అర్థసంచయదుర్గమే యాశ్రయమ్ము 28.**

గర్జతి శరది న వర్షతి
వర్షతి వర్షాసు నిస్స్వనో మేఘః
నీచో వదతి న కురుతే
న వదతి సుజనః కరోత్యేవ ౨౯

**వరుస వెన్నెల కాలము వానకాల**
**మందు మబ్బులు పట్టిన అరచు, కురియు**
**కుజన దుర్జన రీతులు కూడ ఇట్లె**
**చెప్పి తప్పుట, చేయుట చెప్పకయును. 29.**

అనుకురుతః ఖలసుజనా
వగ్రిమపాశ్చాత్యభాగయోః సూచ్యాః
విదధాతి రన్ధ్రమేకో
గుణవానన్యస్తు పిదధాతి 30

**వరుస దుర్జనసజ్జనపథము లనగ**
**సూది మొదలును చివరను చోద్యమింతె**
**ఒకటి తడయక రంధ్రము లోలి చేయు**
**మరియు నొక్కటి రంధ్రముల్ మరుగు పరచు 30.**

త్యజతి భయం కృతపాపం
మిత్రాణి శఠం ప్రమాదినం విద్యా
హ్రీః కామినమలసం శ్రీః
స్త్రీ క్రూరం దుర్జనం లోకః ౩౧

**పాపకర్ముని విడుచును భయము కూడ,**
**శఠుని మిత్రులు, విద్యను శ్రద్ధ లేమి,**
**కాముకుని సిగ్గు, సోమరి నేమొ కలిమి**
**వనిత క్రూరుని వరుస దుర్జనుని జనులు. 31.**

దక్షః శ్రియమధిగచ్ఛతి
పథ్యాశీ కల్యతాం సుఖమరోగః
ఉద్యుక్తో విద్యాం త
ద్ధర్మార్థయశాంసి చ వినీతః ౩౨

**దక్షు డొందును శ్రేయమ్ము, దాత యశము,**
**పథ్యభోక్త ఆరోగ్యమ్ము బడయగలడు,**
**రోగరహితుడు సర్వసుఖభోగములను,**
**విద్య నుద్యుక్తు డగువాడు, వినయశీలి**
**యర్థధర్మమ్ములను గూడి యశము నొందు 32.**

కోఽన్ధో యో న వినీతః
కో బధిరో యః శృణోతి న హితాని
కో మూఢః కాలే యః
ప్రియాతిథిం నైవ జానాతి 33

అంధు డెవ్వడు? అవినీతు డైన వాడు
బధిరు డెవ్వడు? హిత మైన పట్ట నతడు
మూఢు డెవ్వ డుచితకాలమునను ప్రియుడు
నైన యతిథిని గుర్తింప లేని వాడు 33.

యః పఠతి లిఖతి (సుకృతిం)
పరిపృచ్ఛతి పణ్డితానుపాసయతి
తస్య దివాకరకిరణై
ర్నలినీవ విబోధ్యతే బుద్ధిః ౧౧౫/౩౪

సుకృతి లిఖయించి పఠియించు సుకృతి యెవడొ
పండితుల దండ తగ బోధితుం డెవండొ
వాని బుద్ధియె ప్రవిబోధ్య మౌను గాక!
పద్మ బాంధవు వలననె పద్మ మట్లు 115/34.

ఇమాం కాఞ్చనపీఠస్థాం
సమేత్య కవయో భువి
ఆర్యాం సున్దరపాణ్డ్యస్య
స్నాపయన్తి వధూమివ ౧౧౬/ ౩౫

కడగి భువి నున్న కవు లెల్ల కదలి వచ్చి
ఆర్య! సుందరపాండ్యుని 'ఆర్య' దీని
స్నాన మాడించు చున్నారు స్వర్ణపీఠి
మధుర నున్నట్టి మీనాక్షి వధువు విధము 116/35.

## వినతి గైకొన గోరెద విబుధు లార!

నెలవ్వ నీతుల కీ 'ఆర్య' తెలుగు సేయ
కలము పట్టితి నే నిట్లు కెలవ్వ కలుగ
అలుక లేక తప్పుల దిద్దవలయు బుధులు
సెలవ్వ గైకొందు మీ ముందు తలను వంచి

## చూడవచ్చును మీ రిట 'శ్లోకసూచి'

-:ఆర్య:-

## పద్యమాదిగ చూడుడు 'పద్యసూచి'

